

కదనరంగంలో కాళి - ఝాన్సీరాణి (జయన్తి - నవం-14)




# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)

| సంపుటి : 11 | సంచిక : 11 | ఈశ్వర – కార్తీకం | నవంబర్ – 1997 |
|---|---|---|---|





చందా వివరములు :

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.



చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, "విజయశ్రీ"

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్ : 4617799, 591322.


ఈ సంచికలో ........................ పుట



ముఖచిత్రం : గురునానక్

(సంపాదకీయం :) **భారతమాతాకిజై**

భరత వర్షం , భరత ఖండం, భారత భూమి, కర్మభూమి, వేదభూమి అన్నారు కలియుగ ప్రారంభంనుండి యీ జంబూద్వీపంలోని భారత భూమిని, వేదాలు, పురాణాలు, ఇతిహాసాలలో. కాగా భగవద్గీతలో శ్రీ కృష్ణుడు అర్జునుని భరతర్షభ అన్నాడు.

తురుష్కులు, తెల్లవారు కాలవశాత్తు భరతభూమి పాలకులైనారు. కొంతకాలం భారతీయులు బానిసలైనారు.

భారతిని బానిసత్వం నుండి విముక్తి చేసుకోడానికి భారతీయు (మహమ్మదీయ, క్రైస్తవ మొ॥) లంతా ఏకకంఠంతో 'భారతమాతాకి జై' 'వందేమాతరం' అంటూ ఒకే మంత్రంని నదించారు. స్వతంత్రమైంది భారతి.

దురదృష్టవశాత్తు భారతి రెండు, మూడు ముక్కలైంది. 'భారత సంవిధానం' రచించబడ్డది.

'నాకు స్వర్గం అక్కరలేదు. తిరిగి మానవునిగా లేక జంతువుగా, లేక పక్షిగా లేక, క్రిమి, కీటకంగా లేదా చెట్టు, గుట్ట, రాయిగానైనా భారతభూమిలోనే జన్మించాలని కోరుతానని ప్రతిభారతీయుడు కోరుకున్నాడు – కోరుకుంటాడు.

అట్టి భారతీయులు ' ఇండియా దటీజ్ భారత్' అని రాజ్యాంగంలో రచించవలసి రావడం ఆత్మహత్యా సదృశం. నల్లవారి మనసులో తెల్ల బానిసత్వమా? కాక మరి మన మాతృభూమికి రెండు పేర్లు ( ఇండియా, భారత్) ఎందుకు? ఏ ప్రయోజనాన్ని ఆశించారు? ఎవరు? ప్రజలా? రాజ్యాంగ కర్తలా? పాలకులా? మానసిక బానిసత్వం మాసిపోకనా? ఎందుకు?'

మన జాతీయ గీతం 'జనగణ మన ....లో 'భారత భాగ్యవిధాతా' అన్నారు గాని ఇండియా భాగ్యవిధాత అనలేదే.

మన భారత్ ఒకే జాతీయత, సంస్కృతి, ఐక్యతలకు పెట్టిందిపేరు. పేరులోనే పెన్నిది అన్ననానుడీ ఉంది – కాని ఏ పేరైతే యేమి అనగలమా? కృతఘ్నత కాదా?

మరి బొంబాయి – ముంబై, మద్రాస్ – చెన్నైగా ఎందుకు మార్చుకున్నాము.

**50** సంవత్సరాల స్వతంత్రం అనంతరం స్వర్ణోత్సవాల సందర్భంలోనైనా ' ఇండియా' ను విసర్జించి మానసిక బానిసత్వానికి స్వస్తిజెప్పి, 'భారత్'ను భారత్‌గా ప్రతిష్ఠించడం పాలకుల ప్రజల కర్తవ్యం. కాదా?

స్వర్ణోత్సవాలలో 'ఇండియా'ను 'భారత్'గానే పిలవాలని డిమాండ్‌చేస్తున్నామని అంతర్జాతీయ విశ్వహిందూపరిషత్ అదినేత మా॥ శ్రీ అశోక్ సింహాల్ గారు భాగ్యనగర్ పత్రికా విలేఖరుల సమావేశంలో స్పష్టపరచారు గతమాసంలో.

వారి మార్గదర్శనంలో ప్రస్తుత పాలకులు జాతీయత, దేశభక్తిని, ప్రతిబింబిచే నిర్ణయాలు చేసి అమలు పరచాలనడం అవసరం కదా?

తద్వారా దేశీయులేగాక విదేశీయులు గూడ భారత్, భారత్ అంటూ – పవిత్ర భారతిని తలుస్తారు – భారత మాతాకి జై అంటారు. దేశ గౌరవ, ప్రతిష్టలు ఇనుమడిస్తాయి.

జైహింద్.

**భరత భూమి కానె బదులు 'ఇండియ' – యది**
**ఇంగిలీషువాళ్ళ ఎంగ్లి కూత –**
**జాతికెగ్గు సేయు చరిత మాన్పవలదె?**
**విశ్వహిందు వాణి వినుడు వినుడు.**

**– సుందరం.**

ప్రబోధం

# జై కొట్టరా!

– బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

జయ్ కొట్టరా .... ఓ రన్నా
చెయ్ పట్టగా .... రారన్నా
మన భారతాంబకు
మన వీర మాతకు – ॥ జయ్ ॥
మన పల్లె నుండి ఢిల్లీ వరకు
అన్నదమ్ములం అందరమంటూ
చెట్టుకెన్ని కొమ్మలున్ననూ
అన్ని పువ్వులం ఒకటేనంటూ .... ॥ జయ్ ॥
పాయలెన్నో పారుతున్ననూ
పావన గంగా భవానొక్కటని
రూపాలెన్నో కనిపిస్తున్నా
మనలో మెదిలే భావమొక్కటని .... ॥ జయ్ ।
శివాజీ నేతాజీ తమ్ములమ్మై
ఒకే తలపు ఒకే పిలుపుగా
సమర పథం ధీర వ్రతం
సాగించే సవ్య సాచులమ్మంటూ .... ॥ జయ్ ।
గోవిందుడు గురుగోవిందుల
ధర్మ రక్షణం ఆశయమ్మని
రామచంద్రుడు వివేకనందుల
అడుగు జాడలే ఆదర్శమ్మని .... ॥ జయ్ ॥

# శ్రీ రుద్రమ్

– డా ॥ యమ్ వి ఆర్ శర్మ

నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః ॥

బభ్లుశాయ = వృషభరూపమగు ధర్మము నధిష్ఠించిన వాడు.

(వృషోహి భగవాన్ ధర్మః), అన్నానాం పతయే, వివ్యాధినే = వివిధ ఆహార రూప బాణములను ప్రయోగించు అన్నపతి అగు రుద్రునకు నమస్కారము.

వృషభమనగా ఎద్దు. మనవాళ్లు వృషభమును ధర్మరూపముగా గ్రహించినారు. పరీక్షిన్మహారాజు కలియుగారంభములో ఒంటికాలిపై నిలిచియున్న ధర్మస్వరూప వృషభమును సందర్శించినట్లు భాగవతము తెలుపుచున్నది. కృతయుగములో ధర్మముతిరిగి నాలుగు పాదములపై నిలువగలదు. ఆహార రూపములో గల అన్నము సర్వప్రాణులకు జీవనాధారము. బాణములను ప్రయోగించుటలో కౌశల్యమున్న వాడు రుద్రుడు. మనుష్యుల పూర్వజన్మ దుష్కృతములను ఆధారముగా జేసుకొని కొందరికి అన్నహితవు లేకుండ జేసి, మరి కొందరికి అజీర్ణమును కలిగించి, ఇంకను కొందరికి ఆహారము దొరుకకుండ జేసి – ఏతావతా వారివారికి తగిన ఫలితములను అందజేయు కర్మఫల ప్రదాత రుద్రుడు.

మనకు ఆహారము వర్షాధారముగా లభించును. వర్షములు యజ్ఞముల వలన కలుగును. కనుక అన్నము యజ్ఞమూలకము – యజ్ఞాద్భవతి పర్జన్యః పర్జన్యాదన్న సంభవః యజ్ఞపతి అయిన పరమేశ్వరునకు అన్న పతిత్వము కూడ సముచితమే గదా!

నమోహరికేశాయోప వీతినే పుష్టానాం పతయేనమః

హరికేశాయ = నల్లని వెంట్రుకలతో భాసిల్లెడి నిత్యయౌవన మూర్తియైన ఉపవీతినే = మంగళ ప్రదమైన ఉపవీతమును ధరించిన, పుష్టానాం పతమే = పరిపూర్ణ గుణ యుతులకు పాలకుడగు రుద్రునకు – నమస్కారము.

మరియొక విధముగా – దశవిధ పుష్టులకు పతి. అవి వాక్పుష్టి, జ్ఞాన పుష్టి, శరీరేంద్రియ పుష్టి, గృహక్షేత్ర పుష్టి, ధన ధాన్య పుష్టి, ప్రజా (సంతాన) పుష్టి, పశుపుష్టి, గోపుష్టి, ధర్మపుష్టి, అణిమాది పుష్టి.

గోవులను మామూలు పశువుల కంటె భిన్నముగా చూపుట గమనార్హము.

(వివేకానందం)

# జాగ్రత్తతో ఉండండి

న్యూయార్క్‌లో శ్రీ వివేకానందస్వామి యిలా అన్నారు. ''మీకున్న బుద్ధిబలం మా మహిళలకుకూడ ఉండాలని నేనెంతో కోరుతున్నాను. కాని బుద్ధిబలం పవిత్రతను చెడగొట్టేదయితే అప్పుడు నాకది అపేక్షితం కాదు. మీ విజ్ఞానానికి మిమ్మల్ని నేను పొగడుతాను. కాని, ''చెడుగు''ను పూలతో కప్పి పెట్టి దానిని ''మంచిది'' అని పేర్కొంటారే ఆ మార్గం నాకిష్టం కాదు. బుద్ధిబలం మేలిమియే కాని అదే అన్నిటికంటె పైది కాదు. మేము పాటుపడేదెల్ల నీతికోసం, పారమార్థికతకోసం. మీకున్న విజ్ఞానం మా మహిళలకు లేదు. కాని పవిత్రతలో వారే అధికురాండ్రు. ప్రతి మహిళకును తన భర్తకంటె వేరైన ప్రతి పరపురుషుడును పుత్ర స్థానీయుడు. ప్రతి మగవానికిని తన యిల్లాలు తప్ప ప్రతిస్త్రీయు మాతృస్థానీయురాలు. మీనడుమ ఉన్నప్పుడు దేన్ని మీరు ''స్త్రీలయెడ మర్యాద'' అని పేర్కొంటున్నారో అది నాకు రోత పుట్టిస్తూ వుంది. మేం మగవాళ్లం. మేం ఆడవాళ్లం అనే తలంపే ఉండరాదు. ''అందరం మానవులం'' అనే భావమే ఉండాలి. స్త్రీ పురుష విభేదాన్ని గణింపకుండ, ఉభయ సాధారణమైన మానవత్వాన్ని మాత్రమే మీరు గణించేటంతవరకు మీ మహిళలకు నిజమైన అభివృద్ధి కలుగదు. అంతవరకు వారు కేవలం ఆటవస్తువులేకాని అంతకంటె ఎక్కువ కారు. అందువల్లనే, వివాహాలను రద్దు చేసికోవడంకూడ మీలో సర్వసహజంగా ఉన్నది. మీలో మగవారు స్త్రీలకు మ్రొక్కి, ఆసనమర్పించి, మరుక్షణాన్నే ముఖస్తుతి పాఠాలను ఏకరువు పెడుతారు. యువతీ, యువకుడు ఒకచోట చేరారా, తక్షణమే అతడామెను ''కాంతా! నీ కన్నులెంత అందంగా ఉన్నాయి'' అని స్తోత్రం చేయడం మొదలుపెడతాడు. ఇలా అనడానికి మగవాడికేం హక్కున్నది? మగవారికి అంత ధైర్యమేమి? మీ ఆడవాళ్లు దానికి అనుమతించడం ఏమిటి? ఇలాంటివి మానవునిలో ఉదార ఆదర్శాలను పోషించకుండ జఘన్యాంశాలను హెచ్చిస్తుంది.

''మనం మగవాళ్లం, మనం ఆడవాళ్లం'' అనే తలంపు ఎంతమాత్రం ఉండకూడదు. ''అందరమూ మానవులమే. ఒకరి కొకరికి గారాబంతో తోడ్పడవలసిన వారమే'' అని తలంచాలి. యువతీయువకులు ఏకాంతంలో కలసికొన్న తక్షణమే, యువకుడు యువతికి అతిమర్యాద చూపుతాడు. వరుడు ఒక యువతిని పెండ్లాడగలగటానికి ముందు రెండువందల మంది యువతుల్ని బ్రతిమాలికొని యుంటాడు. నేను వివాహమాడే వారిలో చేరితో శ్రమేమీ లేకుండానే ఒక ప్రియురాలిని పొందగలిగి యుందును.

నేను భారతదేశంలో ఉన్నప్పుడు వెలుపలినుండి మీ ఆచారాలను చూచి '' ఇదంతా సరసమేకాని వేరుకాదు, అంతా బాగానే ఉంది'' అని చెప్పగా విన్నాను. నమ్మాను. కాని

తర్వాత నేను దేశాటానికి పూనుకున్నాను. స్వయంగా చూచి మీ ఆచారాలు బాగాలేవని తెలుసుకున్నాను. మీ ఈ ఆచారమేమో తప్పు. మీరు మాత్రం కన్నులు మూసుకొని, ''చాలబాగుంది మా ఆచారం'' అనుకొంటుంటారు. పాశ్చాత్యదేశీయులైన మీతోవచ్చిన చిక్కేమిటంటే, మీరు పసివారు, అవివేకులూ, చపలచిత్తులు, ధనసంపన్నులు. పసితనం, అవివేకం, చిత్తచాపల్యం, ధనాఢ్యత అనే వీటిలో ఒక్కటి వున్నా గొప్ప అనర్థాల వాటిల్లుతాయి. అంటే ఇక యివన్నీ కూడినచోట చెప్పనక్కరలేదు. జాగ్రత్తతో ఉండండి

## సేవ) గురునానక్ ఉపదేశం

ఆనందపూర్‌లో సత్సంగం చేస్తున్న గురునానక్ ఒకసారి ''దప్పికగా వుంది, ఎవరైనా కాసిని మంచినీళ్ళు తెండి'' అని అడిగాడు. ప్రతి రోజు సత్సంగంలో అందరికంటె ముందు వరుసలో కూర్చొనే సిక్కు యువకుడు లేచివెళ్ళి గ్లాసునిండా చల్లటి మంచినీళ్ళు తెచ్చి గురునానక్ చేతుల కందీయబోయాడు. గురునానక్ అతడి చేతులవైపు చూశారు. అవి చాలా సుకుమారంగా ఉన్నాయి. వెంటనే వారా యువకుని, ''కుమారా! నీ చేతులింత సుకుమారంగా ఉన్నాయి. వీటితో ఎవరికీ ఎప్పుడూ ఏవిధమైన సేవా చేయలేదా?'' అని అడిగాడు.

''సద్గురూ! నేను చాలా ధనవంతుల యింట్లో పుట్టి పెరిగాను. అందువల్ల ఎవరికీ ఏవిధమైన సేవ చేసే అవసరం నాకు కలుగలేదు. జీవితంలో మొదటిసారి – అది కూడా మీ కొరకే నా చేతుల్తో మంచినీళ్ళు తెచ్చాను'' అని యువకుడు సమాధానమిచ్చాడు.

గురునానక్ యువకుడు తెచ్చిన నీళ్ళు త్రాగకుండా పక్కకు పెట్టి ఇలా అన్నారు: ''సృష్టిలో అంతటా పరమాత్మ వ్యాపించి యున్నాడని తెలుసుకొని కూడా మనస్ఫూర్తిగా తన చేతుల్తో ఏవిధమైన సమాజసేవ చేయని వ్యక్తియొక్క చేతులు పవిత్రమైనవి కావు. ఆ చేతులతో తాకిన ఏ వస్తువునూ నేను స్వీకరించను.''

(నవంబర్ 14 గురునానక్ జయన్తి)

ఆర్యా!
మీ పత్రికలో ''హిందువుల లేఖలు'' శీర్షిక పెట్టండి. విశ్వవాస్తు, నా ఆశయం, సదుపయోగ మహిమ, నిర్మలక్కాయ్ – శీర్షికలు చాలబాగున్నాయి.

ఇట్లు
Post Box No. 46
కరీంనగరం – 505001.

## (మాతృమందిరం) ఆదినుండి ఆధునికం వరుకు స్త్రీ

### దర్శనాల్లో- స్త్రీ

– డి.జి. విజయలక్ష్మి

అంతర్జగత్‌ను గురించి తెలియజెప్పేదే దర్శన శాస్త్రము. వైదిక దర్శనాల్లో 7 శ్రేణులున్నాయి. న్యాయదర్శనం, వైశేషిక దర్శనం, ఈ రెండింటిని పదార్ధవాద సంబంధీ దర్శనాలంటారు. యోగదర్శన, సాంఖ్యదర్శనాలు, సాంఖ్య ప్రవచన దర్శనాలు. వేదము యొక్క కర్మకాండ, ఉపాసనాకాండ జ్ఞాన కాండను అనుసరించి కర్మమీ మాంసా దర్శనం దైవీమీమాంస, బ్రహ్మ మీమాంస దర్శనాలని మూడు చెప్పబడ్డాయి. అన్ని దార్శనిక శాస్త్రాలోనూ సృష్టికార్యంలో మూలప్రకృతికి ప్రాధాన్యతవుంది. ధర్మ మార్గములో ప్రకృతి నారాధించుట వల్లనే మనిషి అభ్యుదయమును పొందినట్లే, జగజ్జనని నారాధించుట వల్లనే అభ్యుదయము సాధించగలడని, ఆదిఋషులచే ప్రవచించబడింది. జీవదృష్టిలో స్త్రీ పురుషులనే రెండు స్వతంత్ర ధారులున్నట్లు కూడ చెప్పబడింది. అంతేకాదు ఇందులో ప్రతిపాదించబడిన మరో అంశం స్థూల సూక్ష్మ రూపమైన ప్రపంచం ఆకర్షణ, వికర్షణ అనే రెండు శక్తులతో కూడి వుందని, అంతః కరణ వృత్తులలో ప్రేమ ప్రవృత్తి ఆకర్షణ జనితము. ద్వేష ప్రవృత్తి వికర్షణశక్తి. రాగ ప్రవృత్తి వున్న నారీ తన ప్రేమపాశముతో తనవారిని వశం చేసుకుని ఉన్నతులుగా తీర్చిదిద్దుతుంది. అందుకే సృష్టికార్యంలో స్త్రీ బాధ్యత ఎక్కువ. పురుషుని గర్భాదాన బాధ్యత కేవలం కొన్ని నిమిషాలు మాత్రమే. స్త్రీ జీవపిండానికి ప్రాణం పోయటానికి తొమ్మిది నెలలు గర్భధారణ చేసి భరించి, పుట్టిన శిశువును పాలనపోషణతో ఉత్తముణ్ణి చేస్తుంది. అందుకే పుత్రుడు నమస్కరించేటపుడు తొలివందనం తల్లికే చెందాలని, తర్వాతే తండ్రికని మీమాంసా దర్శనాల్లో వివరించబడింది. అంతే కాదు మూల ప్రకృతికి ప్రతిరూపంగా స్త్రీ ధారకు విశేష ప్రతిపత్తి ఇవ్వబడింది. కన్యగా వున్నప్పుడు జగదంబకు ప్రతిరూపంగా ఆరాధించటం, సువాసినీ పూజ వైదిక కర్మకాండలో ఒక భాగంగా వుంది. అంటే స్త్రీ జగజ్జననికి ప్రతిరూపంగా భావించబడింది. అందుకే దేవీభాగవతంలో.

విద్యా సమస్తాః తవ దేవి భేధాః

స్త్రియః సమస్తాః సకలాజగత్సు ॥

యాయాశ్చ గ్రామదేవ్యః స్యుః తాః సర్వాః ప్రకృతీః కలాః కలాంశాంశ సముద్భూతాం ప్రతి విశ్వేషు యోషితః॥ అన్ని విద్యలు, స్త్రీలందరూ జగజ్జనని రూపాలే. గ్రామ దేవతలందరూ, సమస్త స్త్రీలు ప్రకృతి మాత అంశలే. ప్రకృతి పూజ శాస్త్ర సమ్మతమే. అంటే స్త్రీలను పూజించటం కూడ శాస్త్ర సమ్మతమే.

దర్శన శాస్త్రంలో ప్రతిపాదించబడిన అంశాల్నిబట్టి ప్రకృతికి ప్రతిరూపమే స్త్రీ అని తెలుస్తుంది. (సశేషం)

# హిందూ ధర్మ రక్షణే దేశరక్షణ

- ఈమని సువర్ణం ఎమ్. ఎ

హిందూమతం నుండి మతమార్పిడులు:- స్వాతంత్ర్యానికే ముప్పు మన మాతృదేశాన్ని అనాదినుండీ ఐక్యం చేసేది హిందూ ధర్మమే, ఇప్పుడు పలు పాశ్చాత్య దేశాలు హిందూ ధర్మాన్ని బలహీనం చేసి, మనదేశాన్ని విచ్ఛిన్నం చేయుటకు పూనుకున్నాయి. హిందూ ధర్మము నుండి జరుగుచున్న మతమార్పిడులు ఇందులకే. ఇది పాశ్చాత్యుల కుట్రలు.

గాంధీ గారి ఆదేశం

గాంధీగారు ఈ ప్రమాదాన్ని ఊహించి ఎప్పుడో అన్నారు ''భారత దేశానికి పాశ్చాత్యదేశాల నుండి మత ప్రచారానికి ఎట్టి సహాయాన్ని రానీయకూడదు. పాశ్చాత్య మత ప్రచారాన్ని నిషేదించాలి. హిందూమతము నుండి మత మార్పిడులను శాసనరీత్యా అరికట్టాలి. ''మన పాలకులు గాంధీగారి మాటలను లక్ష్యపెట్టక పోవడము విచారకరం. హిందువులు తక్కువగా యున్న కాశ్మీరు నాగాలేండ్‌ల సమస్యలు ఎప్పటికీ తీరక అచ్చటి హింసా కాండలు దేశ విద్రోహ ఉద్యమాలు పెరిగిపోతున్నాయి. హిందూ మతం నుండి మత మార్పిడులను అరికట్టకపోతే, యావత్ భారతదేశం అల్లకల్లోలాలకులోనై శాంతి భద్రతలు కోల్పోయి, విచ్ఛిన్న శక్తులు పెరిగి, స్వాతంత్ర్యానికే ముప్పు తప్పదు.

పాశ్చాత్య దేశాలలోని సాంఘిక దుస్థితి :

పాశ్చాత్య దేశాలలో కుటుంభ వ్యవస్థ పతనదశలో వున్నది. అచ్చట భార్యాభర్తల అనురాగం క్షీణిస్తున్నది. ఎక్కడ చూసినా విడాకుల జారత్వమే, వృద్ధులైన తల్లిదండ్రులు అనాధ శరణాలయాలలో కన్నకొడుకుల ఆప్యాయతకు కరువై కుమిలిపోతున్నారు. అవసాన దశలో ఉన్న తన కొడుకును చూడాలని కబురు చేస్తే ఆకొడుకు ''నా భార్య రానీయటం లేదు'' అని అంటాడు. ఎదిగిన పిల్లలు విచ్చల విడిగా అసభ్యంగా తిరుగుతున్నారు. అసంఖ్యాకంగా పెరుగుతున్న పెళ్ళిగాని తల్లుల సంగతి వేరే చెప్పనక్కరలేదు. వీదులలోనే మగవారు ఆడవారు కౌగిలింతలతో, పశువుల కంటే హీనంగా ప్రవర్తిస్తారు అచ్చట భార్యా భర్తలకు మతి స్థిమితం లేక మానసిక రోగాలతో బాధపడుతున్నారు. పాశ్చాత్యమతం మనదేశంలో పెరిగితే మనదేశానికీ ఈదుస్థితే పట్టును.

అందుచేతనే అంబేద్కరు ఈలాగున అన్నారు. ''జారత్వంతో కూడిన ఈపాశ్చాత్య జీవితవిధానం, పాశ్చాత్య మత ధోరణులు నాకు అక్కరలేదు''. అంబేద్కర్ హిందూ మతానికి అంతర్భాగమైన బౌద్ధమతం తీసుకున్నాడే గాని, క్రిష్టియన్ మతం కాదు. అంబేద్కర్ ఇంకా ఇలాఅన్నారు. భారతదేశంలో ఇతర మతాలు వ్యాప్తంఅయితే, భారత దేశం విచ్ఛిన్న కాక తప్పదు.

ఇతర దేశాలలో వ్యాప్తం జౌతున్న మన ధార్మిక విలువలు

లక్షల కొలదీ పాశ్చాత్యులే తమ పాశ్చాత్య జీవిత విధానంలో విసుగెత్తి మనశ్శాంతికి మన దేశానికి వస్తున్నారు. ఇందులకు పుట్టపర్తి ఒక ప్రత్యక్ష నిదర్శనం. పాశ్చాత్య దేశాలలో పాశ్చాత్యులు ''హరేరామ హరేరామ'' అంటూ ఎంతో భక్తి పరవశులై వీధులలో నామ సంకీర్తనలను చేస్తున్నారు. అచ్చట చర్చీలకు వెళ్ళే వారులేక అనేకచోట్ల చర్చీలు మూతపడిపోతున్నాయి. అమ్ముడైపోతున్నాయి. అచ్చట ఫాదరీల అవనీతి ప్రవర్తనలు అత్యాచారాలు తరుచు బయట పడుతూ ఉంటాయి. మనదేశంలో రామకృష్ణ మిషన్, సత్యసాయి సంస్థలు, మనమతాధిపతులు ఆర్. యస్. యస్., వి.హిం.ప. లాంటి ధార్మిక సంస్థలు అగ్నిహోత్రం లాగున ఉన్నాయి. అందుచేతనే పాశ్చాత్య దేశాలలో వేలకొలదీ రామకృష్ణ మిషన్, సత్యసాయి సంస్థలు. దిన దినాభివృద్ధిలో ఉన్నాయి. అచ్చట మన వేద శాస్త్రాలకు, రామాయణ, భాగవతాలకు, గౌరవం పెరుగుతుంది. మహా మేధావులైన పాశ్చాత్యులే ఈ గ్రంథాలను పరిశోధన చేసి మన ధర్మాన్ని కొనియాడుతూ లక్షలకొలదీ ప్రతులను పాశ్చాత్య భాషలతో ప్రచురణ చేస్తున్నారు.

(ఆలయాలు)

## శనిదేవాలయం

సింగణాపూర్:

మహారాష్ట్రలో షిరిడీకి 70కి.మీ. దూరంలో సింగణాపూర్ చిన్నగ్రామం. ఆ గ్రామంలో శనేశ్వరుడు స్వయంభూ. ఆశిలామూర్తి 56.అ.ఎత్తు. 2 1/2 అ.వెడల్పు. 1 1/2 అ.మందముతో కృష్ణవర్ణంలో ఉన్నాడు. సర్వకాల సర్వావస్థలలో సర్వ ప్రాణులకు అందుబాటులో ఉన్నమూర్తి శని. (గ్రహము) సింగణాపూర్ పరిసరాల్లోకి కలి పురుషుడు ప్రవేశించలేడంటారు. అందుకు నిదర్శనమేమో ఈ ఊరిలో ఇండ్లకు ద్వారబంధములు, తలుపులు లేవు. అయినా దొంగలభయము, సర్పభయములు లేవు చివరకు 'ఊరకుక్కలు సహితం ఇండ్లలో జొరబడవు' శనిదేవునికి గుడిలేదు. మూర్తికి ఎదురుగా పంచ (మూడువైపుల గోడలు పైనకప్పు) గలదు.

శనికిపూజారిలేడు. దేశంనలువమూలలనుండి భక్తులు అటకువెళ్ళి పూజలు చేసి (తైలాభిషేకం, టెంకాయలు కొట్టడం వగైరా) వస్తుంటారు.

శని ఈశ్వరాంశమంటారు.

---

జగిత్యాల వరంగల్ విభాగ్ సత్సంగ కేంద్ర నిర్వాహకుల శిక్షణా శిబిరం అక్టోబర్ 3,4,5 తేదీలలో నిర్వహించబడ్డది. శ్రీ కె. సుధాకర రావుగారు శిబిరాధికారి కాగా, సర్వశ్రీ గోపాలరెడ్డి, డా॥ శంకర్, డా॥ రాజ్‌రెడ్డి, శ్రీ శివరావు ప్రభృతుల మార్గదర్శనంలో 55 మంది శిక్షార్థులు

(మధురగాథలు)

# గొప్ప ధర్మాత్ముడు

ఓ రాజుకు నలుగురు కొడుకులుండేవారు. ''ఎవడైతే సర్వాధికుడైన ధర్మాత్ముణ్ణి వెతికి తీసుకువస్తాడో అతడికే రాజ్యాధికారం యీయబడుతుంది'' అన్నాడు. రాకుమారులు నలుగురూ గుఱ్ఱాలెక్కి నాలుగు దిశలకూ బయలుదేరారు.

కొన్నాళ్ళు గడిచాయి. పెద్దకొడుకు తిరిగి వచ్చి తండ్రికి ఎదురుగా ఓ శేఠ్‌ను నిలబెట్టి ''ప్రభూ! ఈ శేఠ్‌గారు సర్వదా వేలాది రూపాయలు దానం చేస్తూంటారు. వీరు ఎన్నో ఆలయాలు కట్టించారు. చెరువులు త్రవ్వించారు. చలివేంద్రాలు ఏర్పాటు చేశారు. తీర్థక్షేత్రాలలో వీరు ఎన్నో వ్రతాలు కొనసాగిస్తుంటారు. నిత్యం వీరు పురాణ శ్రవణం చేస్తుంటారు. గోపూజలు చేస్తుంటారు. ప్రపంచంలో వీరిని మించిన గొప్ప ధర్మాత్ముడెవడు ఉండడు'', అన్నాడు.

''ఈయన నిశ్చయంగా ధర్మాత్ముడే'' అని రాజు పలికి ఆ శేఠ్‌ను సత్కరించి పంపివేశాడు.

రెండవ కొడుకు ఓ బక్కచిక్కిన బ్రాహ్మణుణ్ణి తీసుకువచ్చి ''ప్రభూ ఈ బ్రాహ్మణోత్తముడు నాలుగు ధామాలకు, సప్తపురాలకు కాలినడకన వెళ్ళి యాత్రలు చేసివచ్చాడు. సదా వీరు చాంద్రాయణ వ్రతం చేస్తుంటారు. అసత్యానికి వీరు భయపడతారు. ఈయన కోపగించడం ఎవరూ, ఎన్నడూ చూడలేదు. నియమబద్ధంగా మంత్రజపాదులు పూర్తిచేసుకున్న తరువాతనే జలపానం చేస్తారు. త్రికాలాల్లోనూ స్నానంచేసి సంధ్యావందనం చేస్తారు. ఈ కాలంలో యీ విశ్వంలో వీరిని మించిన సర్వశ్రేష్ఠ ధర్మాత్ములెవరూ మరిలేరు'', అన్నాడు.

రాజు బ్రాహ్మణదేవతకు నమస్కరించి అధిక దక్షిణలిచ్చి ''వీరూ మంచి ధర్మాత్ములే'' అంటూ పంపివేశాడు.

మూడవ కొడుకు కూడ మరలి వచ్చాడు. అతనితో కూడ ఓ బాబాజీ ఉన్నారు. ఆ బాబాజీ వస్తూనే ఆసనం వేసుకుని కళ్ళు మూసుకుని కూర్చుండి పోయారు. జీర్ణమైన బట్టలతో అస్థిపంజరంలా ఉన్న ఆకారంతో ఆయన కనిపిస్తున్నాడు. అందరూ ఆసీనులైన తరవాత మూడవ కొడుకు - ''ప్రభూ! వీరు ఎంతగానో నేను ప్రార్థించగా యిక్కడకు విచ్చేశారు. వీరు మహాతపస్వులు. వారానికి ఒక్కసారి మాత్రమే క్షీరపానం చేస్తారు. గ్రీష్మఋతువులో పంచాగ్ని మధ్యంలో ఉంటారు. శీతాకాలంలో జలాలలో నిలబడుతారు. సదా భగవంతుని ధ్యానంలో వుండే వీరికి మించిన మహాధర్మాత్ములు లభించడం దుర్లభమే'', అన్నాడు. రాజు ఆ మహాత్మునికి సాష్టాంగప్రణామంచేసి వారి ఆశీస్సులు అందుకుని వీడ్కోలు పలికాడు. ఆపై! వీరూ ధర్మాత్ములే అన్నాడు.

అందరి తరువాత చిన్నకొడుకు వచ్చాడు. అతనితో మాసిన బట్టలు కట్టుకున్న పల్లెలో నివసించే ఓ రైతు ఉన్నాడు. దూరం నుండియే రాజుకు దండాలు పెడుతూ భయపడుతూ ఆ రైతు వచ్చి నిలబడ్డాడు, అన్నలు ముగ్గురూ తమ్ముని మూర్ఖత్వానికి పకపక నవ్వారు. అప్పుడా చిన్నవాడందుకుని - ''ప్రభూ! ఓ కుక్కకు గాయం తగిలింది. ఇతడది చూసి దాని గాయం

కడిగాడు. అంత నేనితణ్ణి తీసుకువచ్చాను. ఇతడు ధర్మాత్ముడవునో కాదో మీరే అడిగి తెలుసుకోండి'', అన్నాడు.

రాజు అడిగాడు, '' ఏమయ్యా! నువ్వు ఏం ధర్మం చేస్తుంటావు?''.

భయపడుతూనే రైతు పలికాడు ''ప్రభూ! నేను చదువుకున్నవాణ్ణి కాను. నాకు ధర్మం అంటే ఏం తెలుస్తుంది? ఎవరైనా జబ్బుపడితే సేవచేస్తాను. ఎవరైనా యాచిస్తే గుప్పెడు మెతుకులు పెడతాను''.

అంతరాజు '' ఇతడే అందరికన్న గొప్పధర్మాత్ముడు'' అనగావిని కొడుకులందరూ అటూ యీటూ చూడసాగారు. రాజు ఇలా అన్నాడు – ''దానధర్మాలు చేయడం, గోపూజ చేయడం, అసత్యమాడక పోవడం, క్రోధంగా ఉండక పోవడం, తీర్థయాత్రలు, సంధ్యావందనం పూజాదులు కొనసాగించడం కూడ ధర్మమే. తపస్సు చేయడం అవశ్యమైన ధర్మమే కానీ సర్వాధిక ధర్మమేమంటే అర్థించక పోయినా అసహాయ స్థితిలో ఉన్న వారిని ఆదుకోవడం, రోగికి సేవచేయడం, కష్టంలో ఉన్నవారికి చేయూతనీయడం సర్వాధికమైన ధర్మము, పరులకు సహకరించే వానికి తనంతతానుగా సహాయం అందుతుంది. త్రిలోక నాథుడైన పరమాత్మ అట్టి పరోపకార పరాయణునిపై ప్రసన్నుడై ఉంటాడు.

''పరోపకారాన్ని మించిన పరమ ధర్మం లేదు''.

(అనువాదం : పి. బాలాన్నపూర్ణ.ఎమ్. ఎ)

## జీవిత సభ్యులు

(ఆత్మ విమర్శ)

# హిందువులు ఆలోచించ వలసిన సంగతులు

– డా॥ శ్రీ ప్రకాశ్

(మదరాసు రాష్ట్ర గవర్నరుగాను, ఆ తరువాత కరాచీలో భారత రాయబారిగాను పనిచేసిన స్వర్గీయ డా॥ శ్రీ ప్రకాశ్‌గారు 1967లో వ్రాసిన ఒక ఆంగ్ల వ్యాసానికి తెలుగు అనువాదం శ్రీమన్నవ గిరిధరరావు)

పురాతన సంస్కృతి, పరంపర, అమూల్యమైన జీవిత పంథా, విలువైన విశ్వాసాలతో గూడిన హిందూధర్మం వచ్చే శతాబ్ద కాలంలో ఈ గడ్డ మీదనుండి మాయమైపోతుందేమోనని నేను భయపడుతున్నాను.

మానవుడు ఈ జిప్షియన్, గ్రీకులాంటి గొప్ప నాగరికతలు ప్రపంచంనుండి నిష్క్రమించినపుడు కోల్పోయినదాని కంటె ఎన్నోరెట్లు విలువైన ధర్మాన్ని హిందూ మతం అదృశ్యమైనపుడు పోగొట్టుకుంటాడు. నేనీ విషయాన్ని ఒక హిందువుగా చెప్పడంలేదు. వివిధ మతాలను పోల్చిచదివిన ఒక విద్యార్థిగా, తత్త్వవేత్తగా ఆలోచించి మరీ అంటున్నాను.

ఐదు వేలసంవత్సరాలకు పైగా సంక్షోభపరంపరలన్నిటినీ తట్టుకుంటూ నిలబడిన ఈ హిందూ ధర్మం రానున్న శతాబ్దంలో ఎలా మటుమాయమైపోగలదని కొందరు ప్రశ్నింపవచ్చును. విదేశీపాలనాకాలంలో శారీరకంగా మనం వారికి లొంగినా, మానసిక దాస్యానికి ఎన్నడూ పాల్పడలేదు. ఆంగ్లభాషను, సాంకేతిక శాస్త్రాలను పఠించినప్పటికి సాంఘిక విషయాలలో పరంపరానుగతంగా వస్తున్న హిందూధార్మిక విధానాన్ని మనం విడిచిపెట్టలేదు.

కాని, స్వరాజ్యం వచ్చినపిదప మనది 'సెక్యులర్' రాజ్యాంగమని ప్రకటించుకున్నాము. సెక్యులరిజం ఆచరణలో హిందూ వ్యతిరేకతగా తయారయింది.

అన్యమతస్థులు ముఖ్యంగా క్రిష్టియనులు, ముస్లిములు వారిండ్లలో మతసంబంధమైన వాతావరణాన్ని నిలుపుకోజూస్తారు. వారి పిల్లలకు మతబోధచేస్తారు. హిందువులు మాత్రం పూర్తిగా ఇందుకు వ్యతిరేకంగా తయారయ్యారు. సామూహిక ప్రార్థనలు జరుపుకొనుటకు, మతసంబంధమైన వాతావరణాన్ని సృష్టించుకొనుటకు, దురదృష్టవశాత్తు ఏ హిందూకుటుంబము శ్రద్ధవహించుటలేదు. మనలో ఆంగ్లభాషాస్థాయి అంతకంతకు దిగజారిపోతున్నా, మన నిత్య జీవితాన్ని, ఆలోచనలను, ఆంగ్లీకరణ చేసుకొనడంలో ప్రముఖులమగుచున్నాము.

గతంలో చేసిన తప్పులనుండి గుణపాఠాలు గ్రహించడానికి నిరాకరిస్తున్నాం. మన సామాజిక జీవితంలో పాతుకుపోయిన అస్పృశ్యత అనెడి జాడ్యంవలన లక్షలాది సోదరులను పోగొట్టుకుంటున్నాము. ఈ జాడ్యం మూలంగా దాదాపు మూడోవంతు హిందూజాతి తన విశ్వాసాన్ని మార్చుకున్నది. మిగతావారు దాన్నిగూర్చి పట్టించుకోరు. ఈ విధంగా తమకు తామే నష్టపరచుకుంటూ, హిందువులు ఆపదలోనున్నారు.

ఇతరులలో ఉండే మంచితనాన్ని స్వీకరించడానికి సిద్ధంగాలేము. చెడ్డవాటిని మాత్రం అనుకరించడానికి ఉత్సాహపడుతున్నాము. ముస్లిములు వారినిత్య జీవితంలో ఆదర్శవంతమైన సోదర భావాన్ని వెల్లడించుకుంటారు. కలవాడు లేనివాడని తరతమ భేదాలు చూపకుండ సహపంక్తి భోజనాలకు, సామూహిక ప్రార్థనలకు వారెంతో విలువనిస్తారు. బ్రిటిష్ వారినుండి గూడ పనికిరాని వాటినెన్నింటినో నేర్చుకున్నాం. కాని వారినుండి నియమబద్ధమైన జీవితం, క్రమశిక్షణ, దృష్టిని లక్ష్యంమీద కేంద్రీకరింప చేయడం, నిరంతర క్రియాశీలతలాంటి గుణములను నేర్చుకోలేదు. మనకుమనమే శత్రువులమవుతున్నాం. మనహృదయ కుహరాలలోకే శత్రువులు ప్రవేశించినప్పుడు వినాశనం ఎంతో దూరం లేనట్లే.

ఈ పరిస్థితిని పట్టుదలతో సరిదిద్దుకోవాలి. హిందువులు సంకుచిత మనస్తత్వం విడనాడి వాస్తవాలను ఒప్పుకోవాలి. అందరికి సమాన గౌరవ ప్రపత్తులనిచ్చి ఆత్మవికాసానికి, సమాన అవకాశాలు కలిగించగల సామాజిక వ్యవస్థా నిర్మాణానికై మనం మన సర్వస్వాన్నీ వెచ్చించాలి. ముస్లిముల నుండి ఆదర్శ సోదరభావాన్నీ, క్రైస్తవులనుండి క్రమశిక్షణాయుత త్యాగశీలాన్నీ గ్రహించాలి.

హిందువులు అస్పృశ్యతానివారణకు దీక్షాకంకణం ధరించి శపథం చేయాలి. కడజాతి వారినిగా పరిగణించి మనసోదరులను మనం దూరం చేసుకోరాదు. ఈ ఆదర్శం, ఈ విశ్వాసం ఏమాత్రం సడలినా మన జాతియొక్క పునాదులే విచ్చిపోతాయి. అశ్రద్ధ చేయబడిన వారందరూ వాళ్ల విశ్వాసాలనే మార్చుకొని పరాయి మతాలను ఆశ్రయించారు. కనుక మనం అస్పృశ్యతావాదులం కాకూడదు.

విద్యావంతులమైనా, సంపన్నులమైనా నిరాడంబరంగా జీవించడం చాల అవసరం. హిందువుల ఆదర్శం యిదే, తద్వారా అసూయలకు, ద్వేషాలకు తావివ్వక అందరం ఒకటే అనేభావానికి కట్టుబడుతాము. హైందవేతరులనుండైనను సద్గుణాలను గ్రహించి, వాటిని మన నిత్య జీవితంలో మేళవించినపుడు హిందూధర్మం అంతరించే ప్రమాదముండదు. ఆనాడు హిందూ ధర్మం ప్రపంచానికి వెలుగునివ్వగలదు.

# దేశభక్తిని మహమ్మదూ మెచ్చుకున్నాడు

-దత్తో పంత్ ఠెంగ్డే

ఇస్లాం అసలు నిబంధనలు దేశభక్తి భావనతోనే వున్నాయి. ప్రవక్త దేశభక్తితోసహా అన్ని ఉదార సద్గుణాలను ప్రోత్సహించాడు. మతరీత్యా కూడా అతను పూర్వమతాలమీద, అతని కాలంలోని ఇతర మతాలమీద యుద్ధాన్ని ప్రకటించలేదు. పవిత్రకురాన్‌లో పూర్వమతాలల్లోని సత్యాలను వ్యతిరేకించలేదు. భగవంతుడు ప్రతి దేశానికి ప్రవక్తల నిచ్చి ఆశీర్వదించాడు.

''ప్రతి ప్రజకు ఒక మార్గదర్శకుడున్నాడు'' (కురాన్ : xxiii - 3)

''హెచ్చరించేవాడు లేని ప్రత్యేక ప్రజలంటూ ఎవ్వరూ లేరు.''

తత్ఫలితంగా హజరత్ మీర్జా గులాం అహమ్మద్ ఇలా వ్రాశాడు: '' ఏ భూభాగానికి చెందినవారైనా ఎవరి బోధలు అక్కడ చిరకాలం గౌరవించబడ్డాయో వాళ్లను దేవదూతలుగా గౌరవించాలి. అల్లా తప్పుడు ప్రవక్తలు గౌరవించబడటాన్ని సహించడు. ప్రజామోదం పొందిన ప్రతి బోధకుడూ వందనీయుడే. బుద్ధుడు, శ్రీకృష్ణుడు, శ్రీరామచంద్రుడు, అందరూ నిస్సందేహంగా దైవాంశసంభూతులే. తర్వాతి వాళ్ళ మెరుగు పూతలు వారి తొలి బోధల్ని మరుగుపెట్టి వుండవచ్చు.''

తన అనుయాయులు ఆయాదేశాల్ని మోసం చెయ్యాలని మహమ్మద్ ప్రవక్త అని వుంటాడన్నది అసంబద్ధమైన ఆలోచన.

ఈనాడు జాతీయవాదులు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయారు. మహమ్మదీయ మతాన్ని పుచ్చుకున్న హిందూ జాతీయుల్ని తిరిగి మన జాతీయ సంస్కృతిలో ఇముడ్చుకోవటం సాధ్యమేనా? అని అనుమానం వస్తోంది.

కాని హిందూ జాతీయ సంస్కృతికి, వ్యక్తిగత ముస్లిం నమ్మకానికి పొసగదనటం సరికాదు. మన సంస్కృతి అన్ని మతాల్ని, అందరు ప్రవక్తల్ని ఆహ్వానిస్తుంది. ఐతిహాసికంగాకూడా భారతీయ ముస్లింలు విదేశీయులుకాదు. వాళ్ళవీ మనలాటి రక్తమాంసాలే. మనం విదేశీయులైన హూణుల్ని, శకుల్ని కూడా జీర్ణించుకున్నాం. మన రక్తమే ప్రవహిస్తున్న వీళ్ళను కలుపుకోవటం కష్టం ఎలా అవుతుంది? విదేశీయ విరోధులు కూడా సంస్కరించబడ్డారని చరిత్ర చెబుతోంది.

# సరి

(గత సంచిక తరువాయి)

రాష్ట్రకవి: డా॥ శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

మెహనదాస్ కంటె మోతి లాలునికంటె, నుద్యమస్ఫూర్తిలోను గ్రుడతడు
జాతీయ భావనా జాగృతి యందున, జాతిరత్నము నగఁజాలినతడు
ఆర్య సమాజాన నాశ్రద్ధనందుతోఁగలిసి తిర్గిన యట్టి ఘనుడతండు
హిందూ మహాసభాహితవరి తానౌచు, మాలవ్యతోఁ గల్సిమసలినతడు
పట్టుపంజాబి తలపాగ చుట్టువాడు, దీర్ఘదేహుడు బంగారు దీప్తివాడు
లాలుత్రయ మందునొకడుగాలబ్ధకీర్తి, యిట్టిలజపతిఁ గీర్తింపనేరితరము!
''సైమను'' నెదిర్చు భీషణ సమరమందుఁ, దిన్నపోలీసు లాఠీల దెబ్బవలన
జర్జరిత కళేబరు డౌటఁజనియెనకట! ఆంధ్రకేసరి కతడన్న యమిత! మమత!
విఠల భాయిపటేలు వివేకవంతు, డతని మీద బ్రకాశము కధికభక్తి
ఇర్వురున్ కల్సియెన్నియో యిష్టమైన యిష్టులందున (బాల్గొన్న యిద్ధమతులు
చెప్పగ పార్లమెంటపుడసెంబ్లి యటంచును బిల్వగాఁబడెన్
ఒప్పుగ విఠ్ఠలుండచట నుండె సభాపతి యౌచుదానికిన్
గొప్పగ నిర్వహించితగుఁ గూర్మినిఁ బేర్మినిఁ గొల్లగొట్టుచున్
మెప్పులు పొందెనంచు మితిమించిన మాటలు చెప్పనేటికిన్!
స్పీకరని యెడు పదవికి శ్రేష్ఠమైన గౌరవంబును గూర్చిన ఘనుడతండు
ఏవిదేశపు పార్లమెంటేని గాక! స్పీకరైవెల్గి మనగల్గు సిద్ధుడహహా!
అట్టిడు విఠ్ఠలుండు మఱి యాంధ్రుల కేసరి యాప్త మిత్రులై
జట్టుగనుద్యమించుచును చాలగఁ దిర్గిరి దేశమంతన
ప్పుట్టున టంగుటూరి దగువత్తిడి మాటలు నాదరించితా
ఛట్టున స్పీకరన్ పదవి చప్పుడు లేక పరిత్య జించుచున్
జాతీయోద్య మమందు పాల్గొనుచుఁదాజైలున్ ప్రవేశింపగన్
చేతః ఖేదము దేహయాతనలు హెచ్చెన్నందు రోరోజుకున్
ప్రాతర్వేళల జైలునన్ స్ట్రెచరుపైపై నుండి జార్విడ్వగన్
జాతానేక విఘాత దేహుడతడై చావున్ ప్రతీక్షింపగన్
భయముఁజెందిన పాలకుల్ నయమునెంచి, విఠలు భాయిపటేలును విడిచిపెట్టె
కాని గట్టివౌ దెబ్బల కతననతడు, కొన్నినాళ్ళకు మరణించెఁగుమిలికుమిలి
జరిగెనిద్ది కోయంబతూర్ జైలునందు, దీనికంతకు హేతువుతాను కాదో!
అనుచుఁదలపోసి కుమిలెను ననవరతము, టంగుటూరి ప్రకాశము సంగతముగ!

# అవినీతి అంతమయ్యేనా?!

–వెన్నెల నరసింహారావు

''అవినీతి పరుడుగా రుజువైన నాయకుడిని సమీపంలో నున్న ఎలక్ట్రిక్ స్తంభానికి గట్టి ఉరితీయండి'' – నెహ్రూ

''అవినీతి విశ్వవ్యాపితం'' – ఇందిర

''అవినీతిపై మరో స్వతంత్ర పోరాటం జరపాలి'' – సంగ్మా

''అవినీతి అంతమైతేనే దేశానికి ప్రగతి''

ప్రముఖులు చేసిన పైవ్యాఖ్యలు పరిశీలిస్తే 'అవినీతి' అనేరుగ్మత దేశప్రగతిని ఎంతగా క్షీణింపచేస్తుందో సదృశ్యం. నిజానికి ఈ నేపథ్యంలో నాటి ప్రధాని నెహ్రూగారి సలహాను చట్టబద్ధంచేసి శిక్షిస్తే నీతిమంతులైన నాయకులు అనేవారు ఎవరైనా మిగులుతారా?! ఇక ఇందిర వ్యాఖ్య అక్షరసత్యమే అయినా ప్రపంచంలోని అభివృద్ధి చెందిన దేశాల్లో అవినీతి అనేది అచ్చటి అభివృద్ధికి ఏమాత్రం ఆటంకం కాలేదు. కాని అభివృద్ధి చెందుచున్న మనదేశంలోనే ఈ 'అవినీతి' ఏదో ఓరూపంలో అన్నిరంగాల్లోనూ అంటువ్యాధికంటె వేగంగా వ్యాపించి ఆర్థిక వ్యవస్థనే సంస్కరించలేనంతగా ఛిన్నాభిన్నం చేసింది.

స్వాతంత్ర్యం సాధించి **50** సం॥లు దాటినా ప్రపంచంలో మనం యింకా వెనుకబడిన దేశంగాను, పేదప్రజలున్న సుసంపన్న దేశంగానూ వర్ణించబడుట విచారకరం. ఓవేళ స్వతంత్రం వచ్చిన తొలి **25** సంవత్సరాలు పరిపాలనానుభవలోపం, వనరులపై సరైన అవగాహన లేకపోవుట, ప్రకృతివైపరీత్యాలు, యుద్ధాలు వంటి బాలారిష్టాలు ఎదురై కొంతవెనుకబడినా, మిగతా **25** సంవత్సరాల కాలంలో మనం ఏమాత్రం ప్రగతి సాధించినట్లు? ఇప్పటికీ ధనిక పేద అంతరం అధికంగానే పెరుగుతుంది. ''కాదేదిస్కాములకనర్హం'' అన్నట్లు దేశంలోని అన్నిరంగాలు ఏదో ఒక స్కాంకు గురై స్వర్ణభారతం అన్న పదం స్కాముల భారతంగా మారుట శోచనీయం.

ఈ దృష్ట్యా ఓ సారి జపాన్ గతాన్ని గమనిస్తే **1945** సం॥ రెండవ ప్రపంచయుద్ధకాలంలో అమెరికా తన శత్రుదేశమైన జపాన్‌కు ప్రపంచపటంలో స్థానం లేకుండా చేయాలనే దురాలోచనతో "Little Boy" అనే అణుబాంబును ప్రయోగించింది. అన్నివిధాల సర్వనాశనమైన జపాన్ అచిరకాలంలోనే అగ్రరాజ్యాలధీటుగా అభివృద్ధిసాధించి శాస్త్ర – సాంకేతికరంగాల్లో అమెరికానే సవాల్‌చేస్తుంది. ఇంత ప్రగతి వారికెలా సాధ్యమైంది. అలాగే సామ్రాజ్యవాద దేశాల దమన నీతికి వందల సం.లు బలైన ఎన్నోదేశాలు మరెంతో వృద్ధి సాధించుట గమనార్హం. కారణం ఆయాదేశాల ప్రజల దేశభక్తి, జాతీయత, నిస్వార్థంగా కష్టించిపనిచేసే మనస్తత్వం. ఈ దృష్ట్యా భారత్ పరిస్థితి పూర్తి భిన్నంగావుంది. ఆసియాదేశాల్లోని అన్ని దేశాల్లో భారత్ అతిపేదదేశంగా నమోదైనట్లు Asian Development Bank (ADB) తెల్పింది. అవినీతిలో ప్రపంచంలోనే 8వ స్థానంలో వున్నాం.

ఈ దుస్థితికి కారణం ఏమిటి? మన అధినేతల్లోనూ – అధికారుల్లోనూ పెరిగిన అవినీతి అన్నది నగ్నసత్యం. ఏ చిన్న సంక్షేమ పథకమైనా ఈ దేశంలో అవినీతికి గురికాకుండా అమలు జరుగుతుందా?

సామాన్యుడు ఆకలి బాధతోనో, జీవితంపై నిరాశా నిస్పృహలతో చిన్న తప్పుచేస్తే శతకోటి చట్టాలతో అతన్ని చిత్రహింసలు పెట్టి, చివరకు ప్రాణాలనుసైత హరించే మన ప్రభుత్వాలు అవినీతి పరులైన అధినేతలు – అధికారుల విషయంలో ఎందుకు అలసత్వం వహిస్తున్నారు?

''దేశాన్ని అమ్ముకుంటున్న ఈ రాజకీయ నాయకులకంటె మేమేనయం. మేము మా శరీరాలనే అమ్ముకుంటున్నాం'' అని ఈమధ్య ఇటలీ వేశ్యల నాయకురాలు క్లేరో వాపోయిందంటే 'అవినీతి' మహమ్మారి ఎంత తీవ్రంగా వుందో సుస్పష్టం. ఆమె నిష్పక్షపాతమైన వ్యాఖ్య మననాయకులకు కొంతైనా స్పందన కల్గించగలదా!

'' ఇప్పటివరకూ సంపాదించింది చాలు. ఇకనైనా ప్రజల బాగోగులు చూద్దాం'' అన్న ఆలోచనకు అవినీతి పరులైన అధికారులు – అధినేతలు వస్తే ఈ దేశం స్వర్ణ బాటలో ముందడుగు వేయుట ఖాయం'' అన్న గుడిపూడి శ్రీహరి మాటలు అవినీతి పరులను ఏ కొద్దిగ మార్చినా మనం ధన్యులమే.

★ ఇందలి రచనలు, రచయిత అభిప్రాయాలకు పత్రికబాధ్యత వహించదు. – సం.

---



---

**సంతాపం :**

మహామహోపధ్యాయ తిరుమల రామచంద్ర తమభౌతికదేహాన్ని చాలించారు గతమాసంలో. గొప్ప రచయితగా 'విశ్వహిందు' పత్రికకు మార్గదర్శనం చేశారు. సాహితీవేత్తగా వారు చిరంజీవులు. వారి ఆత్మశాంతికి 'విశ్వహిందు' ప్రార్థిస్తూ, వారి కుటుంబ సభ్యులకు సానుభూతి తెలుపుకుంటున్నది. –(సం.)

## చిన్నకథ ) తనకో న్యాయం - పరులకోన్యాయం

డా॥ కసిరెడ్డి

తనకు ఒకడు హానిచేస్తే మనిషి విమర్శిస్తాడు; అదే మనిషి మరొకరికి హాని చేస్తూ సమర్ధించుకొంటాడు. ఈ సూత్రం మీద రోజూ వేలాది సంఘటనలు జరుగుతుంటాయి ఒక సంఘటన చూడండి!

అదో గ్రామం. ఆ గ్రామంలో ఓ పెద్ద రైతున్నాడు. మరో పేద రైతున్నాడు. ఈ పెద్ద రైతుకు పెద్దమనసు లేదు. కర్మగాలి ఆ ఊరి పెద్ద కూడా ఇతడే. ఏదైనా జరిగితే న్యాయం ఇతనే చెబుతుంటాడు.

ఓరోజు ఈ పెద్దమనిషి ఎద్దుతో పేదమనిషి ఎద్దు పోటీపడింది. రెండూ పొడుచుకొన్నాయి. ఈ పేద రైతు ఎంత ప్రయత్నించినా ఆ రెంటి పోరాటాన్ని ఆపలేకపోయాడు. ఈలోగా పేదరైతు ఎద్దుకొమ్ము అవతలి ఎద్దుకు ఆయంపట్టున తాకింది. పెద్దరైతు ఎద్దుచచ్చిపోయింది.

చిన్నరైతు భయపడిపోయాడు. ఊళ్లోకి పరుగెత్తుకొని వచ్చాడు. పెద్ద రైతు పదిమంది కూచొని ఉన్నారు. అందరిని చూచేవరకు ఈ సన్నకారు రైతుకు మరీభయమేసింది. పరుగు పరుగున ముందుకు వచ్చి, దండం పెట్టి తత్తరపాటున ఇలా అన్నాడు.

''అయ్యా! మీ ఎద్దు మా ఎద్దును పొడిచి చంపింది''

''మనుషుల్ని మనుషులే చంపుకొంటుండే దిక్కులేని ఈ కాలంలో ఎద్దులను గురించి పట్టించుకొనే వాడెవడయ్యా! పాపం! మూగ జంతువులు. వాటికీ మనుషుల రోగం పట్టుకొంటుంది. ఏంచేస్తాం.... ఎవరం మాత్రం ఏం చేయగల్గుతాం!! అన్నాడు ఎంతో విచారాన్ని ప్రకటిస్తూ ఆ పెద్దరైతు.

చిన్నరైతు వెంబడే తమాయించుకొని ''అదికాదయ్యా! పొరపాటున తప్పన్నా! మా యెద్దే పొడిచింది! మీ ఎద్దే చచ్చింది!! అని చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

''అయితే ఎద్దు ధర కట్టేయ్యాల్సిందే'' అరిచాడు పెద్దగా పెద్దరైతు.॥

ఏమంటున్నావు పెద్ద రైతూ! ''మర్యాద రామన్న నవ్వుతూ చూశాడు.

అంతవరకు రామన్నను చూడని అతడు ''ఏంలేదు; ఏమి అనడంలేదు'' అని తలవంచుకొన్నాడు.

''అందరికీ ఒకే న్యాయం'' – ఒకే వ్రేలెత్తాడు రామన్న.

# పరిప్రశ్న

ప్రశ్న

''కన్యాదానము అంటారు. కన్య ఏదయినా వస్తువా? దానముచేయటానికి - తత్వార్థం ఏదయినా వుంటే వివరించండి.
– కె. సత్య, కె. శ్రీలక్ష్మి

.: ఇస్తే Thanks = వందనములు అంటారు పాశ్చాత్యులు. ఇచ్చి సాష్టాంగపాదాభివందనం చేసి దానం అంటారు హిందువులు. దానం అంత పవిత్రమైనది. ఇచ్చిపుచ్చుకోవటాలు దైనందినజీవితంలో నిత్య కర్మ. దానం ధర్మనిమిత్తం చేసే నైమిత్తికకర్మ.

ధార్మిక జీవితానికి వ్యవహార జీవితంలో ఇబ్బంది కలుగకుండటానికి సువర్ణదానం, భూదానం చేయాలి. ఇవి పదార్థదానములు. గోదానం సువర్ణంలాంటి పదార్థదానం కాదు. గోవుచేతనప్రాణి, గోమయం మూత్రముల వలుకు గోవు సాధుజంతువు. సాధుజంతువును సాధువుగ సాకి సాధుత్వాన్ని అలవరచుకోవాలన్న అర్థం ఉన్నది గోదానంలో.

కన్యాదానంలో వీటిని మించిన ప్రత్యేకత ఉన్నది. సృష్టిధర్మాన్ని ముందు తరానికి అందించే భూమి కన్య. ఇందులో మొదటి అంశం గర్భాదానం. గర్భాదానం కొఱకు కన్యాదానం. తను దానంగ గ్రహించిన కన్యకు గర్భమును దానం చేయాలి. ఇక్కడ దానం అనే భావాన్ని ప్రత్యేకంగా గ్రహించాలి. తను గ్రహించిన భూదాన - సువర్ణదాన - గోదానములలో ప్రతిగ్రహీత = గ్రహించినవారు భూమికి - సువర్ణానికి - గోవుకు ఏదానమూ ఇవ్వటం లేదు. ఇది కన్య విషయంలో జరుగుచున్నది. పాదాభివందనం చేసి ఏధార్మికమైన రీతిలో దానాలన్నీ జరుగుతున్నవో అటువంటి రీతిలో, గౌరవ పురస్కారంగ కన్యకు గర్భాదానం చేయాలి పురుషుడు. అదేరీతిలో దానమును గ్రహించాలి కన్య. ఇక్కడ, పవిత్రమైన దానవిషయంలో, స్త్రీ పురుషులిరువురికీ ఇంద్రియసుఖదృష్టి ధర్మానికి విరుద్ధం, దానానికి విరుద్ధం. ఈ సత్యం, ఈ ధర్మం, ఈ నిజం సామాన్య మానవులే గాక సాధారణ సాధకులుకూడా గుర్తించలేదు. భారతంలో వ్యాస మహర్షి అంబఅంబాలికల విషయంలో ఆచరించిన ధర్మం. ఆచరించలేని అంబ అంబాలికలు లోకహానికి దోహదమిచ్చిన పుత్రులను కన్నారు. ఆచరించిన దాసి నీతివంతుడైన పుత్రుని కన్నది. ఆచరించలేని ఈనాటి మనుష్యులందరు కామశిశువులనే కంటున్నారు, ధర్మ శిశువులను కనటం లేదు.

సృష్టిలో, పంచభూతాత్మక ప్రకృతి సచ్చిదానందములనే పౌరుషంతో సచ్చిదానందములనే పౌరుషపరంగానే సమన్వయమైనది. సచ్చిదానందముల ఉనికిలో ప్రకృతి తన ఉనికిని కోల్పోయి సమన్వయమైనది. మానవదేహంకూడ ఈవిధంగా పంచభూతాత్మక ప్రకృతి సచ్చిదానందములనే పౌరుషముల సమన్వయరూపమే, వాస్తవంలో ఇక వ్యవహార దృష్టిలో,

ప్రకృతి స్వరూపంగ సృష్టిచేయబడిన స్త్రీ, ప్రకృతిధర్మాన్ని అనుసరించి, తన జన్మకారకులైన వారినీ - వంశాన్నీ విడిచి, పౌరుషపరంగ సృష్టిచేయబడిన పురుషుని చేరి సృష్టిధర్మాన్ని ముందుతరానికి అందించవలసిన ధ్యేయంతో ధర్మశిశువును కనగలిగిన ప్రకృతి జీవిస్తూ, ధర్మశిశువులను సృష్టిధర్మానికి బద్ధంగ పోషించి - పెంచి, తన సర్వస్వమూ పురుషునికి అర్పించి, పూర్వకాలంలో భర్త మరణిస్తే ఏకవస్త్రం - ముండనంతో వ్యవహారజీవితానికి స్వస్తి చెప్పి సన్యాసినివలె జీవించేటంతగ కన్యను సృష్టి పోషిస్తున్నది. ఇది వ్యావహారికమైన వాస్తవం. అందుకే దానం చేయటానికి వస్తువైనది కన్య.

ఈ నాడు కన్యాదాన ధర్మం అర్థంగాని ఆచరణగ నిలిచింది. ఆవిడ ఆర్జిస్తే భోగిస్తూ ఆలికి అన్నం పెట్టలేని అధముడైనాడు పురుషుడు. అర్థంకాని సైన్సు అడ్డంపెట్టుకుని ఆవిడకు మూడురోజులుకూడా విశ్రాంతినివ్వలేని మూఢుడైనాడు. అన్ని అగచాట్లు అనుభవించి భరించలేక, స్త్రీ చివరికి పురుషునితో సమానహక్కులని ఆరాటపడుతున్నా పురుషుని అండను విడువలేని అబలత్వాన్నే పెంచుకుంటున్నది. చిదానందముల రూపాలు చివరకు చింతలతో చితుకుతూ ధర్మానికి విపరీతార్థాలను వెదకుతున్నయ్. నిలిచి నిజాన్ని వింటే విపరీతాలన్నీ విచ్ఛిన్న మవుతయ్.

**- శ్రీ కృష్ణానంద మఠస్వామి**

---

# మాసవిశేషాలు

## కార్తీకం (నవం.97)

**1.** ఆంధ్రరాష్ట్ర అవతరణ.
**4.** నాగుల చవితి.
**14.** కార్తీకపూర్ణిమ (కోజాగిరి).
గురునానక్ జయన్తి.
ఝాన్సీలక్ష్మి జయన్తి.
నెహ్రూ జయన్తి.
**23.** సత్యసాయి జన్మదినం.
**30.** జగదీస్ చంద్రబోస్ జయన్తి.



## మార్గశీర్షం (డిశం.97)

**4.** గురుతేజ్ బహదూర్ బలిదానం.
**5.** సుబ్రహ్మణ్యషష్టి.
**6.** అంబేద్కర్ వర్ధంతి.
**10.** గీతా జయన్తి.
**13.** దత్తాత్రేయ జయన్తి.
**15.** పొట్టి శ్రీరాములు వర్ధంతి.
ధనుస్సంక్రమణం.
**22** శారదా దేవి జయన్తి
**23** స్వామి శ్రద్ధానంద బలిదానం.
**25** మదనమోహన మాళవ్యా జయన్తి.
క్రిస్టమస్.
**31.** రంజాన్ నెల ప్రారంభం

(పురాణాల్లో సైన్సు) ప్రకృతి శక్తులను ప్రేరేపించగల శక్తి

# ''మంత్రాలకు'' ఉన్నదా?

– పోలిసెట్టి బ్రదర్స్

ఖచ్చితంగా ఉంది. నిర్ణీత పౌనఃపున్యం (Frequency) తో వెలువడే మంత్రశబ్ద తరంగాలు, ప్రకృతిలోని అద్భుత శక్తుల్ని పలుకరించగలవు. ప్రకృతిలో కొన్ని మార్పులను కల్గించగలవు. అంతేకాదు. ప్రకృతిలోనే కాకుండా సృష్టిలో కూడా అనంతంగా వ్యాపించి ఉన్న (దైవ) శక్తిని మంత్రాలు మనకు అనుసంధాన పరచగలవు. (దైవాంశను మనకు అనుసంధానపరచే శబ్దమే ''ఓంకారమని'' గమనించండి.) అయితే మంత్రానికి ''త్రికరణ శుద్ధి'' అవసరం. మనసా, వాచా, కర్మణా శుద్ధి కలిగిన జీవికే మంత్రోచ్చారణ సంపూర్ణ ఫలితాన్ని ఇస్తుంది. అయితే నేటికాలంలో త్రికరణ శుద్ధి అనేది చాలావరకూ తరిగిపోయింది. అందువల్లనే మంత్రాల ప్రభావం కూడా తగ్గిపోయింది. పురాణకాల మేధావులు మంత్రాలకు చింతకాయల్నేకాదు, అవసరమైతే నక్షత్రాలను కూడా రాలగొట్టగలిగే శక్తి కలిగి ఉండేవారు. అన్నివిధాలా భ్రష్టుడైన నేటి కలియుగ మానవుడు మాత్రం – మంత్రంద్వారా చింతకాయల్ని కాదుగదా, పువ్వులోని పుప్పొడిని కూడా రాలగొట్టలేడు. మనకు ఫలించనంత మాత్రాన మంత్రశక్తిని విమర్శించడం అవివేకం. చేతకాకపోయినా కూడా కనీసం శాస్త్రీయ సత్యాన్ని తెలుసుకోవడం వివేకం. ఆధ్యాత్మిక శక్తి ద్వారా దైవశక్తి సహాయంతో కార్యాలు సాధించగలిగేది ''మంత్రం''. మనసు యొక్క యుక్తితో, తద్వారా పుట్టిన శక్తితో కార్యాలు సాధించేది ''యంత్రం'' (Machine).

**శబ్ద తరంగ శక్తికి ఒక ఉదాహరణ :**

నిర్ణీత పౌనఃపున్యంతో వెలువడే మంత్రశబ్దాలు ప్రకృతిలోని అద్భుత శక్తుల్ని పలకరించగలవా? వాటినుంచి జవాబు పొందగలవా? ఇవి చాలా సహజమైన ప్రశ్నలు. వీటికి నిదర్శన సహితంగా జవాబు చెప్పగలగాలి. అప్పుడే మంత్రప్రభావం నిజమని తెలుస్తుంది. ప్రకృతిలోని అదృశ్యశక్తిని పలుకరించగల శక్తి శబ్దతరంగాలకు ఉన్నదా? అనే విషయాన్ని పరిశీలించాలి మనం. ఇందుకోసం ఒక చిన్న ఉదాహరణగా ''కీ ట్రేసర్'' అనే పరికరం గురించి తెలుసుకుందాం.

'కీ' ట్రేసర్ : తాళం చెవులు తగిలించుకునే 'కీ ట్రేసర్' అనే పరికరం, అగ్గిపెట్టె సైజులో ఉంటుంది. బ్యాటరీ సహాయంతో పనిచేస్తుంది. తాళం చెవులతో సహా అది గదిలో ఏమూల పడిపోయినా, మనం కష్టబడి వెదకనవసరం లేదు. ' ఒక విజిల్' వేస్తే చాలు. కీ ట్రేసర్ ఏ మూలనున్నాసరే, అక్కణ్ణుంచే మూడు సార్లు కూతకూస్తూ మనకు బదులిస్తుంది. మనకు తాళంచెవుల ఆచూకీనిస్తుంది కనుక దాన్ని 'కీ ట్రేసర్' అన్నారు. మనం వేసే విజిల్ పుట్టించిన శబ్దతరంగాలు తనకు చేరగానే, దానికి సమాధానంగా మూడుసార్లు కూస్తుంది కీట్రేసర్. ఈ క్రీ ట్రేసర్‌లలో ఒక్కొక్క రకం విజిల్ అవసరమౌతుంది. కొనేముందు విజిల్ వేసి పరీక్షించుకుని, కీ ట్రేసర్‌ను ఎంచుకోవాలి. అంటే ఒక్కొక్క కీ ట్రేసర్ ఒక్కొక్క విధంగా, నిర్ణీత పౌనఃపున్యం కలిగిన

విజిల్ (శబ్ద) తరంగాలను సమాధానం ఇస్తుందన్నమాట. ఇదంతా మన కంటికి అందని విషయం. కానీ కళ్ళముందు జరుగుతున్న యదార్థం. అందువల్లనే "కంటికి అందనంత మాత్రాన ఏ శక్తీ లేదంటూ కొట్టిపారేయకూడదు". నిర్ణీత పౌనఃపున్యంతో వెళ్ళే శబ్ద తరంగాలకు బదులిచ్చే శక్తులుంటాయని 'కీ ట్రేసర్' ద్వారా మనకు అర్థమౌతోంది. మంత్రశక్తి కూడా ఇటువంటిదే! మంత్రశబ్ద తరంగాలతో ప్రకృతి శక్తులను పలకరించి, బదులు పొందవచ్చునని ఇందుమూలంగా తెలుస్తోంది.

కంటికి కనపడితేనే నమ్ముతాం అనే సిద్ధాంతం అన్నివేళలా కుదరదు. కంటికి అందని శక్తులు సృష్టిలో అనేకం ఉన్నాయి. విద్యుచ్ఛక్తి, అయస్కాంతశక్తి మొదలగు శక్తులు ఈ కోవకు చెందినవే!

## విదేశీ ఉత్పత్తులు బహిష్కరించండి - ఆర్థిక దురాక్రమణను అరికట్టండి

| ఉత్పత్తులు | ప్రోత్సహించవలసినవి | బహిష్కరించవలసినవి |
|---|---|---|
| వంటనూనెలు | గోద్రెజ్, సన్ఫ్లవర్, మారుతీ | డాల్డా, క్రిస్టల్, సన్‌డ్రాప్, సోయా |
| వనస్పతులు | గగన్, పోస్ట్‌మాన్, ధారా, హనుమాన్, అమృత, రుచి. | బ్రిటానియా |
| అగ్గిపెట్టెలు | జయహింద్, షేర్, మోల్, జైకిసాన్, జైజవాన్ వగైరా దేశవాళీ ఉత్పత్తులు | టిక్కా, హోమ్‌లైట్ విమ్కో ఉత్పత్తులు |
| విద్యుత్ సామగ్రి | ఇ.సి., వెల్కో, వెస్టన్, మర్ఫీ, బజాజ్, షోలార్, ఉషా, యాంకర్, బెంగాల్ ల్యాంప్స్, మైసూర్ సీమా, నోవినో సెల్స్, కెల్ట్రాన్, మెల్ట్రాన్, సూర్య, శక్తి. | జిఇసి, ప్రీజ్, ఫిలిప్స్, సోని, నేషనల్, బిసియల్, టి.డి.కె., ఎవరెడీ, బ్యాటరీలు, టార్చిలు |
| వ్రాతపరికరాలు | విల్సన్, కేమ్లిన్ ఇతర స్థానిక ఉత్పత్తులు పారాస్, లగ్జరీ, రొటమెక్ | పార్కర్, పైలట్ వగైరా. |
| స్టేషనరీ | కేమ్లిన్, మిలన్, అజంతా, నటరాజ్, అశోకా, నటరాజ్ | కోరస్ ఉత్పత్తులు అన్ని |
| టైర్లు | జె.కె. మోడీ, విక్రాంత్, ఎమ్. ఆర్. ఎఫ్, సియర్ స్టోన్ | అపోలో, ఫైర్‌స్టోన్, సియట్, గుడ్ ఇయర్, డన్‌లప్. |
| రేడీమేడ్ దుస్తులు | ఎపేరల్, విల్కో, డియర్లీ, క్లయిమెన్స్ | ర్యాగ్లర్, నాయిక్, డ్యూక్, ఆదిదాస్, పవర్, ఫ్యూమా. |
| రంగులు | ఏషియన్, గర్వేయర్, స్నోసెమ్. | డ్యూక్, బర్జర్, గుడ్‌లాస్ - నెరోలాక్ |
| సూట్‌కేసులు | వి.ఐ.పి., సఫారి, అరిస్టోక్రాట్ | ఎకోలాక్, ఆదిదాస్, స్కైబాగ్. |

గురూజీ చెప్పినకథలు

## హిందువునని చెప్పడానికి సిగ్గెందుకు?

నాకు తెలిసినాయనకు ఒక్కడే కొడుకు. వారి ఆర్థిక స్థితి అంత గొప్పదేమీ కాదు. అయినప్పటికీ తండ్రి అనేక కష్టాలకోర్చి కుమారునికి పెద్ద చదువులు చెప్పించాడు. అందువల్ల కుమారునికి పెద్ద ఉద్యోగం వచ్చింది. ఉద్యోగానికి తగినట్లు అతని భార్య సంపన్న కుటుంబం నుంచి వచ్చింది. వారు పెద్ద బంగళాలో ఉండేవారు. తండ్రిమాత్రం వారికి ఇబ్బంది కలిగించరాదని భావించి వేరుగా ఉంటూ, తన పని తాను చేసుకొంటున్నాడు. ఒక రోజున తనకు మనుమడు పుట్టాడని తెలిసింది. పిల్లవాడిని చూడాలని కుమారుని ఇంటికి వెళ్ళాడు. తండ్రి వెళ్ళేటప్పటికి కొడుకు తన స్నేహితులతో కలసి టీ తాగుతున్నాడు. తండ్రిని చూచి కొడుకు ఆందోళన చెందాడు. తన స్నేహితులు ఈ పల్లెటూరి మనిషి తన తండ్రి అని కనుక్కొంటారేమని భయపడ్డాడు. తండ్రితో పక్కవాకిలి ద్వారా లోపలికి పొండి అన్నాడు. కాని అతని స్నేహితులు చూడనే చూసారు. ' ఆయన ఎవరు?' అని అడిగారు. 'మా పాత నౌకరు. ఇప్పుడే గ్రామం నుంచి వస్తున్నాడు' అన్నాడు. ఈ మాటలు తండ్రికి వినిపించినవి. చాల బాధ కలిగింది. ఆయన తన కుమారుని స్నేహితులతో ''వాడి తల్లిని అడగండి, నేనెవరో చెబుతుంది'' అన్నాడు. వెంటనే తిరిగి తన ఇంటికి పోయాడు.

విదేశీవిద్య కారణంగా స్వార్థపూరితమైన వాతావరణంలో పెరగడం వల్ల వ్యక్తులలో అహంకారం, స్వాభిమాన రాహిత్యం కొట్టవచ్చినట్లు కనబడుతోంది. అందువల్ల తాము హిందువులమని చెప్పుకోవడానికి సహితం సిగ్గుపడుతున్నారు.

---

★ కార్యకర్త తన శీల సంపదకు మధురవాక్కును, మధుర వ్యవహారాన్ని కూడా జోడించ గలిగిననాడే అతడు ఇతరులను సమైక్యపరిచి, అన్ని రకాల కష్టాలు, పరీక్షలలో సాహచర్య భావనతో వారిని నిలిపి ఉంచగలుగుతాడు.

**- శ్రీ గురూజీ**

★ ప్రవాహంలో పడి కొట్టుకుపోవటం నాయకుడి లక్షణం కాదు. అది అనుచరుని లక్షణం. తన ఉద్దేశాలకు అనుగుణంగా పరిస్థితులను సైతం పరివర్తన చేసుకుని, ప్రజాభిప్రాయాన్ని తన వైపుకు మరల్చుకోగలిగినవాడే నిజమైన నాయకుడు. ప్రజాభిప్రాయాన్ని నియంత్రించటమే నాయకత్వానికి గీటురాయి. కాని ప్రజాభిప్రాయానికి అనుగుణంగా పోవటం కాదు. అవసరమైతే ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా పోయేందుకు సైతం ఏమాత్రం సంకోచించకపోవటమే నిజమైన సత్యనిష్ఠ.

**- డా॥ హెడ్గేవార్‌జీ**

# ఇంటికి ఈశాన్యము - మనిషికి మరోప్రాణము

– వాస్తురెడ్డి.

ఇంటికి ఈశాన్యము మనిషికి మరోప్రాణము లాంటిది. ఈశాన్య దోషం వికటించి మనిషి మరణానికి కారణమవుతుంది. ఈశాన్యము వాస్తుదోషరహితమై శుభలక్షణాలతో కూడి ఉన్నప్పుడు దాని యజమాని కీర్తి ప్రతిష్టలతో పాటు అష్టభోగాలను అనుభవిస్తాడు, అష్ట ఐశ్వర్యాలను ఆర్జిస్తాడు అనడంలో అతిశయోక్తి లేదు. ఈశాన్యం భవిష్యత్తుకు బంగారుబాట వేస్తుంది. ఈశాన్యం వలన లభించే కీర్తి ప్రతిష్టలు, సంపదలు తరతరాలకు అందుతాయి. కీర్తి శాశ్వతమై చరిత్రలో లఖించబడుతుంది. ఈశాన్యం ప్రభావం చెప్పాలంటే ప్రపంచంలో ప్రసిద్ధి చెందిన ఆలయాలలో తిరుమల రెండవది. భారతదేశంలో మొదటిది. తిరుమల ఆలయానికి తూర్పు రోడ్డు కోనేరు కారణంగా తూర్పు ఈశాన్యాన్ని పెంచుతూ ఉత్తరానికి సాగుతుంది. ఇది ఎంతో శుభ ఫలితాలను ఇచ్చే వాస్తులక్షణం. అలాగే ఆలయానికి తూర్పు ఈశాన్యం వీధిపోటుంది. ఇది అనన్యమైన కీర్తి ప్రతిష్టల నిచ్చేశుభలక్షణం గల వీధిపోటు. ఆలయానికి ఈశాన్యంలో మరొక శుభలక్షణం ఉంది. అదే ఈశాన్యంలోని కోనేరు. దీనికారణంగానే స్వామివారికి కోటాను కోట్ల ఆదాయం వస్తుంది. ప్రపంచ చరిత్రను పరికించినట్లయితే కొన్ని సంఘటనలు కొన్నిసార్లు ప్రపంచదృష్టిని ఆకర్షిస్తాయి. వాటికి ప్రపంచవ్యాప్తంగా కీర్తి క్షణాలలో వస్తుంది. అయితే కొద్ది కాలంలోనే ఆకీర్తి భూస్థాపితం అవుతుంది.

రామర్ పిళ్లై పెట్రోలు తయారీని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. ఇలాంటి కీర్తి ప్రతిష్టలు వాయువ్యం కారణంగా వస్తాయి. అయితే వచ్చిన కీర్తి ప్రతిష్టలు ఎంతో కాలం నిలువవు. అదే ఈశాన్యం వలన లభించిన ఫలితమేదైనా కలకాలం మన్నుతుంది. ఇప్పుడు ఈశాన్యం శుభలక్షణాలు ఎన్ని రకాలు, వాటి ఫలితాలను మరియు ఈశాన్యం దోషాలు ఎన్ని రకాలుగా ఉంటుంది, వాటి ఫలితాలను తెలుసుకుందాం.

ఈశాన్యం శుభలక్షణాలు – రకాలు – ఫలితాలు

ఈశాన్యం శుభలక్షణాలు పన్నెండు రకాలుగా ఉంటుంది.

**1.** ఈశాన్యంలో నీరు : ఇది మూడు రకాలుగా ఉంటుంది.

**1.** సరిగ్గా ఈశాన్యం మూలలో నీరు: ఇది బావి, కొలను పెద్ద పంపు మరియు ఏ రూపంలో నీరు ఉన్నా శుభలక్షణంగానే పరిగణించవచ్చు. ఈశాన్యంలో నీరు ఈవిధంగా ఉండడం వలన కీర్తిప్రతిష్టలు – సంపదలు సమానంగా లభిస్తాయి. సుఖ సంతోషాలు, అష్ట ఐశ్వర్యాలు లభిస్తాయి. తరగని సంపద తరతరాలకు అందుతుంది. శాస్త్ర పాండిత్యం ఉన్నత విద్య అబ్బుతుంది. సకల శుభఫలితాలకు దానిని సంకేతంగా చెప్పవచ్చు.

**2.** తూర్పు ఈశాన్యంలో నీరు: ( ఏ రకంగానైనా ఉండవచ్చు) దీనివలన కీర్తి ప్రతిష్టలు మాత్రమే లభిస్తాయి. సంపదలకు ఈ శుభలక్షణం పూచీ పడదు. పిల్లలకు మంచి విద్యఅబ్బుతుంది. శాస్త్ర సాహిత్యాదులలో, వ్యాపారంలో, ఉద్యోగంలో మంచి పేరు గడిస్తారు. అయితే

(ఇతరదోషాలు లేకపోతే) ఆర్థికంగా ఇబ్బంది పడాల్సిన పరిస్థితి మాత్రంరాదు.

3. ఉత్తరంలో నీరు : (బావి, కొలను, పంపు ఏ రూపంలోనైనా ఉండవచ్చు) నీటి వరదలా సంపదలు వచ్చి చేరుతాయి. అయితే ఉన్నత కీర్తి ప్రతిష్టలకు ఈ శుభలక్షణం పూచీ పడదు. స్త్రీలకు వరప్రసాదిని అనిచెప్పవచ్చు. స్త్రీలకు ఆర్థికాభివృద్ధిలో కూడిన ఫలితాలు మంచి విద్య వారి స్వంతం అని చెప్పవచ్చు.

2. ఈశాన్యం వీధిపోటు : ఇది మూడు రకాలుగా ఉంటుంది.

1. సరిగ్గా ఈశాన్యం మూలకు వీధిపోటు : సరిగ్గా ఈశాన్యం మూలలో నీరు ఉన్నప్పుడు లభించే శుభఫలితాలన్ని ఈ విధిపోటు వలన లభిస్తాయి.

2. తూర్పు ఈశాన్యం వీధిపోటు : తూర్పు ఈశాన్యంలో నీరు ఉన్నప్పుడు లభించే శుభఫలితాలన్ని తూర్పు ఈశాన్యంలో వీధి చూపు ఉండడం వలన లభిస్తాయి. అయితే, శుభలక్షణం యొక్క పరిమాణాన్ని బట్టి పరిణామం (ఫలితాలు) ఉంటాయి. మంచి అధికారం, హోదా, ప్రమోషన్స్ లభిస్తాయి.

3. ఉత్తర ఈశాన్యం వీధిపోటు :

ఉత్తర ఈశాన్యంలో నీరు ఉన్నప్పుడు చెప్పబడిన శుభ ఫలితాలన్నీ ఉత్తర ఈశాన్యం వీధిపోటుకు గూడా లభిస్తాయి. (సశేషం)

''ఈనాటి విద్యార్థులు B.Sc; M.Sc.డిగ్రీలను మాత్రం సంపాదించటమే గాక శాస్త్ర విజ్ఞానమును ఆకలింపు చేసుకోవటానికి కృషి చేయాలి. ప్రభుత్వములో ఏదో ఒక ఉద్యోగమును సంపాదించుట కొరకు డిగ్రీలను పొందుట, నా అభిప్రాయంలో అత్యంత నిరర్థకము, నిష్ప్రయోజనం. స్వయం ఉపాధికల్పనకు, తాను సంపాదించిన విజ్ఞానము ఉపయోగపడినప్పుడే, వ్యక్తి అభివృద్ధి దేశాభ్యుదయమును సాధించగలరు. పాఠశాలలో కళాశాలలో విద్యాబోధన మాతృభాషలోనే జరిగినప్పుడు విద్యార్థులు ఆయా పాఠ్యాంశములలోని విజ్ఞానమును సులభముగా అవగాహన చేసుకోవటానికి తోడ్పడుతుంది.''

– ఆచార్య ప్రఫుల్ల చంద్రరే

– సేకరణ: చే రెడ్డి శ్రీరామ్‌రెడ్డి

**సంతాపం :**

విశ్వహిందూపరిషత్‌లో అనేక బాధ్యతలు స్వీకరించిన శ్రీ కొత్తూరి సీతయ్యగుప్త గారు దివంగతులైనందున పరిషత్ వారి ఆత్మ శాంతికై ప్రార్థిస్తూ, వారి కుటుంబ సభ్యులకు సానుభూతి తెల్పుకొనుచున్నది.

ప్రధానకార్యదర్శి
వి.హిం.ప.

(మి.ఫో)

# దళిత క్రిష్టియన్ల రిజర్వేషన్లు - రాజకీయ పరమైన కుట్రతో చర్చలు

''దళిత క్రిష్టియన్లకు రిజర్వేషన్లు కావాలని చర్చికోరటానికి కారణం వారు హిందూ దళితులను మతం మార్పిడి కార్యక్రమంలో కావాల్సిన ధన సరఫరాను దాతలనుండి స్వీకరించ కలగాలని, ఎందుకంటే అందులోని చాలా ధనభాగం హిందువులనుండే వస్తుంది కనుక. అంతేకాక దాతలనుండి వచ్చిన సహాయంతో క్రైస్తవుల ఓట్లు సురక్షితంగా వుంచుకొని కాంగ్రెసు కేంద్రలో అధికారంలో కొనసాగాలి అన్న ఆలోచన తెరవెనుక గాధ. (బ్రహ్మదత్త భారతి - రిజర్వేషన్స్ ఫార్ దళిత క్రిష్టియన్స్)

భారతదేశంలో క్రైస్తవమత ప్రచారానికి సంబంధించిన కొన్ని సత్యాలు

**1.** **1947** సం॥లో భారత్‌లో **79** లక్షల మంది క్రైస్తవులుండిరి. నేడు వారి సంఖ్య పెరిగి సుమారు **2**కోట్లు అయింది.

**2.** సుమారు **2** లక్షల క్రిష్టియన్ మిషనరీలు దేశంలోని విభిన్న చర్చిల ద్వారా హిందువుల మతమార్పిడి యోజనలో నిమగ్నమై వున్నవి.

**3.** చర్చి భారతదేశాన్ని **109** భాగాలుగా విభజించింది. ప్రతి ఏటా సుమారు **2** లక్షల మంది హిందువులు మతమార్పిడి చేయబడుతున్నారు.

**4.** భారతదేశంలో **76** దేశాలనుండిసుమారు నాలుగువేల మిషనరీలద్వారా ధర్మాంతరణ కార్యం నిర్వహిస్తూ వుంటాయి.

**5.** భారతదేశంలో రమారమి రెండువేల మంది నన్స్ (క్రైస్తవ మత ప్రచారికలు) సంఖ్య ప్రతి సంవత్సరం పెరుగుతూ వున్నది.

**6.** క్రైస్తవుల యొక్క సుమారు రెండు వందలమంది క్రైస్తవ మత ప్రచారకులు వారి శిక్షా కేంద్రాలద్వారా ఆరు మిషనరీలు సిద్ధం చేస్తారు.

**7.** **1980** నుండి **1986** వరకు గృహ మంత్రాలయం అంగీకరించిన విధంగా ప్రతి సంవత్సరం రెండు నుండి నాలుగు వందల ముప్పై ఎనిమిదికోట్ల రూపాయల విదేశీ ద్రవ్యం ఈ దేశంలోని క్రైస్తవుల సంస్థలకు పంపబడింది. ఇందుకు ఎన్నోరెట్లు అక్రమ మార్గాల ద్వారా కూడా చేర్చబడింది.

**8.** క్రైస్తవ ఫాదరీల ఆధీనంలో సుమారు **26000** చ.మైళ్ల స్థలము వున్నది.

**9.** గత సంవత్సరం (**1981-1991** వరకు) క్రైస్తవుల జనసంఖ్య అభివృద్ధి అరుణాచల్ ప్రదేశ్‌లో **309%**, మణిపూర్‌లో **201%**, త్రిపురలో **290%**, సిక్కింలో **298%**, కర్నాటకలో **538%** మరియు గుజరాత్‌లో **175%** గా వున్నది.

(అనువాదం) ఎం. ఆర్. రావు

## (సంస్కారభారతి) ఊరూరా, ఇంటింటా భారతి

స్వతంత్ర స్వర్ణోత్సవ సాంస్కృతిక రథజైత్ర యాత్ర

(1997 అక్టోబరు 2 నుండి – 1998 జనవరి 26 వరకు)

స్వతంత్రస్వర్ణోత్సవ సాంస్కృతిక జైత్రయాత్రలో ఊరూరా, వాడవాడలా, ఇంటింటా భారతమాతను ప్రతిష్ఠిద్దాం. రండని సంస్కార భారతి పిలుపునిస్తున్నది. రెండు రండు – జైత్ర యాత్రలో పాల్గొనుడు.

జైత్రయాత్ర రథసారధి, 'భాగ్యనగర భారతి' డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారితో పదం పలకండి, కదం కలపండి – సంస్కృతీ దురాక్రమణను నిరోధించండి. దేశ భక్తితో, భారతీయ ఏకాత్మతకై, ఏకోదరబాంధ వ్యాలు నెరపండి – జాతి రుగ్మతలు బాపండి.

స్వతంత్ర భారతి పురోగమనానికై పాటుపడండి – (రథయాత్రా గమనం యీ క్రింద గమనించగలరు).

★ నవంబర్ – 1997

| | |
|---|---|
| 1.11.97 | యాదగిరిగుట్ట |
| 2.11.97 | భువనగిరి |
| 3.11.97 | ఘటకేసర్ |
| 4.11.97 | ఉప్పల్ |
| 5.11.97 | ఇ.సి. ఐ. ఎల్. |
| 6.11.97 | మేడ్చల్ |
| 7.11.97 | శంకరపల్లి |
| 8.11.97 | వికారాబాద్ |
| 9.11.97 | తాండూరు |
| 10.11.97 | పర్గి |
| 11.11.97 | చేవెళ్ళ |
| 12.11.97 | రాజేంద్రనగర్ |
| 13.11.97 | శంషాబాద్ |
| 14.11.97 | షాద్‌నగర్ |
| 15.11.97 | జడ్చర్ల |
| 16.11.97 | మహబూబ్‌నగర్ |
| 17.11.97 | నారాయణ ఖేడ్ |
| 18.11.97 | వనపరి |
| 19.11.97 | కొత్తకోట |
| 20.11.97 | గద్వాల్ |
| 21.11.97 | కర్నూల్ |
| 22.11.97 | అనంతపూర్ |
| 23.11.97 | ధర్మవరం |
| 24.11.97 | ప్రొద్దుటూరు |
| 25.11.97 | బద్వేల్ |
| 26.11.97 | కడప |
| 27.11.97 | మదనపల్లి |
| 28.11.97 | చిత్తూరు |
| 29.11.97 | తిరుపతి |
| 30.11.97 | శ్రీకాళహస్తి |

★ డిసెంబర్ – 1997

| | |
|---|---|
| 1.12.97 | గూడూరు |
| 2.12.97 | నెల్లూరు |
| 3.12.97 | బుచ్చిరెడ్డిపాలెం |
| 4.12.97 | పార్లపల్లి |
| 5.12.97 | కావలి |

| | | | |
|---|---|---|---|
| 6.12.97 | ఒంగోలు | 19.12.97 | విజయవాడ |
| 7.12.97 | మార్కాపురం | 20.12.97 | మంగళగిరి |
| 8.12.97 | శ్రీశైలం | 21.12.97 | గుంటూరు |
| 9.12.97 | నాగర్‌కర్నూల్ | 22.12.97 | నరసారావుపేట |
| 10.12.97 | కల్వకుర్తి | 23.12.97 | చిలకలూరిపేట |
| 11.12.97 | దేవరకొండ | 24.12.97 | చీరాల |
| 12.12.97 | నల్గొండ | 25.12.97 | బాపట్ల |
| 13.12.97 | మిర్యాలగూడ | 26.12.97 | రేపల్లె |
| 14.12.97 | సూర్యాపేట | 27.12.97 | తెనాలి |
| 15.12.97 | కోదాడ | 28.12.97 | కూచిపూడి |
| 16.12.97 | ఖమ్మం | 29.12.97 | మచిలీపట్నం |
| 17.12.97 | కొత్తగూడెం | 30.12.97 | ఏలూరు |
| 18.12.97 | నందిగాను | 31.12.97 | భీమవరం |

# (అభి) మతం

ఓ మిత్రమా!
మానవునిలో
నిద్రాణమై యున్న
మానవతను పెంచి
స్నేహ సౌశీల్యాలను కల్గించి
జీవన విధానాన్ని వివర్ణించి
దేవుని మార్గాన్ని చూపించి
మానవత్వం నుండి దైవత్వం వైపు నడిపించి
మనిషిని మనిషిగా తీర్చిదిద్ది
విశ్వకల్యాణాన్ని సాధింపజేయునదే
నిజమైన మతమని నా అభిమతం

– వొడూరి నరసింహరావు

# దశదిన సంస్కృత సంభాషణ శిబిరం

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని కోఠి మహిళా కళాశాల తెలుగుశాఖ సహకారంతో భాగ్యనగర్ సంస్కృతభారతి వారు ఉచిత దశదిన సంస్కృత సంభాషణ శిబిరం నిర్వహించారు 97 సెప్టెంబర్ 20 నుండి 23 వరకు ఈ శిబిరం జరిగింది. ఎం. ఏ. తెలుగు, విద్యార్థినుల 20 మంది పాల్గొన్నారు.

సంస్కృతభారతి కార్యకర్త శ్రీకవీంద్ర తరగతులు తీసుకొన్నారు. సంస్కృత విభాగ మాజీ అధ్యక్షులు ఆచార్య ఎం.గోపాల రెడ్డి ముఖ్యాతిథిగ పాల్గొన్నారు. వారు తమ సందేశంలో సంస్కృత సంభాషణ నుండి కావ్యాధ్యయనం వరకు విద్యార్థినుల ఎదగాలనికోరారు. డా॥ జోస్యుల భీమసేన శర్మ తమ ఆశీః ప్రసంగంలో సంస్కృతం భాష కన్నింటికి మాతృక ఎట్లో వివరించారు. డా॥కె. నీలకంఠశర్మ తమ ప్రసంగంలో పదిరోజుల్లో మంచి ఫలితాలేసాధించారనీ, ఈ అధ్యయనం నిరంతరం కొనసాగాలని అన్నారు. సభాధ్యక్షుల ఆచార్య ముదిగొండ శివప్రసాదు తమ ప్రసంగంలో ప్రపంచ భాషల్లో సంస్కృతం స్థానం అపూర్వమైందని – అది అన్నిటికీ మూలమని ఎన్నో ఉదాహరణలిచ్చారు.

సభ ప్రారంభంలో కోఠి మహిళాకళాశాల తెలుగుశాఖ ఇంచార్జి అధ్యక్షులు డా॥ కసిరెడ్డి స్వాగతంపలికారు, చివరలో వందన సమర్పణ చేశారు. తెలుగుశాఖ ఉపన్యాసకులు డా॥ కుసుమాబాయి, డా॥ ఎన్. ఆర్. వెంటేశం, డా॥ బి. కేశవులు తదితరుల సహకారాన్ని వారు ప్రశంసించారు.



Res : 292345

**S.M. BALASUBRAMANYAM,** IAS
*SECRETARY TO GOVT.*

**ANIMAL HUSBANDRY &**
**FISHERIES DEPT.**
AP SECRETARIAT.
HYDERABAD.
DO LR NO. 6981/AH. III/97-
SEPTEMBER 18, 1997.

*Dear,*

Sub : Animal Husbandry Dept - Selling Cows, Calves and other useful cattle for the purpose of slaughter and illegal slaughter of cow, calves strict instructions - Issued.

Ref : From the Director of Animal Husbandry, Ap Hyd. Lr No. 14548 / D6 / 97, dt.14.7.1997.

* * *

1. I am to inform you that several representatives from various organizations and societies like AP Jeeva Raksha. Sangham, Goraksha. Samithi and AP Veterinary Council have brought to the notice of Government that even though strict instructions have been issued from Government to the Dist. Collectors and Superintendents of Police, vide Memo No.1598/AH.III/97, dt.14.3.1997, no suitable steps have been taken to convene Animal Welfare Committee meetings in their respective districts.

2. I, therefore, request you to convene a meeting with Revenue, Marketing, Police and Transport Depts. and frame guidelines to prevent illegal slaughter of healthy animals and stop the sale of cows, calves etc., to the butchers and prevent sacrifices of animals and birds in temples and dargas.

3. I am to further request you to ensure that no instances of violation of the provisions of the AP Prohibition of Cow Slaughter and Animal Preservation Act, 1997 come to the notice of the Government and take effective steps to enforce the said Act scrupulously.

*Yours sincerely,*
Sd/-
(S.M.Balasubramanyam)

(వి.హిం.ప. కార్యకర్తల ఉపయోగార్థం - సం.)

To
All the Dt. Collectors in the state (By name)
*Copy to:-*
The Secretary
A.P. Jeevaraksha Sangham
Guntur - 3

Forwarded by Order

Section Officer



ధర్మ యాత్ర మహా సంఘం - తిరుపతి,
బ్రహ్మోత్సవాల సందర్భంలో సేవలందిస్తున్న వి.హిం.ప. కార్యకర్తలు

